# హనుమంతుడి కథ

21



కేసరి అనే వానరుడి భార్య అంజన. కేసరి సన్యసించి తపస్సుకు వెళ్ళగా అంజన వాయుదేవుణ్ణి ఆరాధించి, ఆయన అనుగ్రహం వల్ల కొడుకును కన్నది.





పుట్టగానే ఆంజనేయుడు సూర్యుణ్ణి చూసి పండనుకుని మింగబోయాడు. రాహువు అడ్డొస్తే, వాణ్ణి పట్టుకోబోయాడు. రాహువు వెళ్ళి ఇంద్రుడితో చెప్పుకున్నాడు.





ఇంద్రుడు ఐరావత మెక్కి వచ్చి తన వజ్రాయుధంతో ఆంజనేయుడి హనువుల (గవదల) పైన కొట్టాడు. ఆంజనేయుడు మూర్ఛపోయాడు. వాయుదేవుడికి కోపం వచ్చి ఎటో వెళ్ళిపోయాడు.





గాలి లేక లోకాలు తల్లడిల్లాయి. దేవతలు బ్రహ్మతో మొరపెట్టారు. బ్రహ్మ వెళ్ళి వాయువును బతిమాలాడు. వాయువు మెత్తబడ్డాడు, తన కొడుకును తెచ్చి దేవతల ఆశీర్వాదం ఇప్పించాడు.





హనుమంతుడు సుగ్రీవుడికి మంత్రిగా ఉంటూ ఋష్యమూకం మీద తల దాచుకుంటూండగా రామ లక్ష్మణులు సీతను వెతుకుతూ వచ్చారు. హనుమంతుడు వారిని సుగ్రీవుడికి పరిచయం చేశాడు.





కోతులు సీతను వెతకటానికి పలువైపులా పోయేటప్పుడు రాముడు తన ముద్రికను హనుమంతుడికి ఇచ్చాడు. కోతులకు సంపాతి ద్వారా సీత జాడ తెలిసింది.







రావణుడు ఎత్తుకుపోయిన సీత లంకలో వున్నది. సముద్రాన్ని దాటి లంకకు వెళ్ళగలవా రెవరు? హనుమంతుడే నని మిగిలిన వానరులు నిశ్చయించారు. హనుమంతుడు సరేనని రివ్వున గాలిలోకి లేచి సముద్రం మీదుగా బయలుదేరాడు. దారిలో మైనాక పర్వతం అతనికి కొంతసేపు విశ్రాంతి ఇచ్చింది. మళ్ళీ బయలుదేరాడు.





సురస అనే రాక్షసి హనుమంతుడి దారికి అడ్డొచ్చింది. అతను సూక్ష్మశరీరం ధరించి సురస కుండా దూసుకుని లంకకు వెళ్ళాడు. లంక అనే రాక్షసిని చావగొట్టి నగరం ప్రవేశించాడు.




లంక అంతా వెతకగా అశోకవనంలో సీత కనిపించింది. హనుమంతు డామెను ఒంటరిగా కలుసుకుని, రాముడి ముద్రిక ఇచ్చి, సీతను తన వెంట రమ్మన్నాడు. కాని సీత ఒప్పలేదు.




హనుమంతుడు లంకలో వనాలనూ, జల యంత్రాలనూ ధ్వంసం చెయ్యసాగాడు. అడ్డొచ్చిన రాక్షసులను చావగొట్టాడు. రావణుడు పంపిన జంబుమాలినీ, అక్షయ కుమారుణ్ణి చంపేశాడు.




చివరకు ఇంద్రజిత్తు వచ్చి బ్రహ్మాస్త్రం వేసి హనుమంతుణ్ణి పట్టుకుని బంధించి, రావణుడి దగ్గిరికి తీసుకుపోయాడు. హనుమంతుడి మాటలకు రావణుడు మండిపోయాడు.







హనుమంతుడికి శిక్షగా రావణుడు అతని తోకకు బట్టలు చుట్టి వాటిని అంటించమన్నాడు.
తగలబడుతున్న తోకతో హనుమంతుడు లంకంతా తగలబెట్టాడు.

సీత జాడ తెలిసి రాముడు వానర సేనతో లంకకు వచ్చి రావణుడితో యుద్ధం ఆరంభించాడు. హనుమంతుడు రాముడికి వాహనమయాడు. ఇంద్రజిత్తుతో యుద్ధంచేస్తూ లక్ష్మణుడు మూర్ఛపోయాడు.





హనుమంతుడు సంజీవి పర్వతాన్ని తెచ్చాడు. పని అయినాక పర్వతాన్ని ఎప్పటిచోట వుంచాడు. రావణుడితో యుద్ధంచేస్తూ లక్ష్మణుడు మళ్లీ మూర్ఛపోయాడు. హనుమంతుడు మళ్లీ బయలుదేరాడు.





కాలనేమి అనే రాక్షసుడు మునివేషంలో ముందుగానే వచ్చి పర్వతం మీద వున్నాడు. దాహంగా వుందంటే మొసలి కొలను చూపాడు. హనుమంతుడు తనను పట్టుకున్న మొసలిని చంపాడు.





ఆ మొసలి ధాన్యమాలి అనే దివ్యాంగనగా మారి కాలనేమి రాక్షసుడని చెప్పింది. హనుమంతుడు కాలనేమిని కూడా చంపేశాడు. కాని సంజీవిని ఇవ్వటానికి అక్కడి గంధర్వులు ఒప్పలేదు.



హనుమంతుడు గంధర్వులను ఓడించి పర్వతం ఎత్తుకుని వస్తూండగా కాలనేమి తండ్రి మాల్యవంతుడు సపరివారంగా హనుమంతుడి పైకి వచ్చాడు, ఓడిపోయాడు.




రామ రావణ యుద్ధంలో హనుమంతుడు ఖడ్గరోమాదులైన అనేక రాక్షసులను చంపాడు. రామ లక్ష్మణుల చేతిలో అనేకమంది రాక్షస వీరులు చచ్చారు. చివరకు రావణుడే హతుడయాడు.




రాముడి విజయవార్తను హనుమంతుడే సీతకు చేరవేశాడు. అతను రాముడి కన్న ముందు బయలుదేరి గుహుడికీ, భరతుడికీ చెప్పి, రామ పట్టాభిషేకమైనాక తిరిగి కిష్కింధకు వెళ్ళిపోయాడు.




ద్వాపరయుగం వచ్చింది. పాండవులు అరణ్యవాసంలో వున్నారు. భీముడు సౌగంధికాపహరణానికి బయలుదేరి, దారి కష్టంగా ఉన్న హనుమంతుణ్ణి తొలగమని ఆజ్ఞాపించాడు.





"ముసలివాణ్ణి, కదలలేను," అన్నాడు హనుమంతుడు. భీముడు హనుమంతుడి తోకను పక్కకు నెట్టలేక పోయాడు. రెండు చేతులా పట్టినా అది లేవలేదు.





తాను కోతి అనుకున్నది హనుమంతుడని తెలిసి భీముడు క్షమాపణ చెప్పుకుని, కురుక్షేత్ర యుద్ధంలో తమకు సహాయంగా ఉండమన్నాడు. హనుమంతుడు అందుకు సమ్మతించి, అర్జునుడి రథం పైని ధ్వజానికి గుర్తుగా ఉండిపోయాడు.